# THE PRISONER OF CHILLON.

TRANSLATED INTO TELUGU VERSE

BY

**Srishtu Jagannadhasastry.**

First Grade Pleader, Rajahmundry.

శ్రీ శ్రీష్టు-జగన్నాధశాస్త్రి విరచితంబైన

## చిలాఁబంది అను భ్రాతృసౌహార్దము.

Printad at

Mr: DAMARAJU SIVARAMAYYA'S

SRI TRIPURA SUNDARI PRESS.

**Ellore.**



*Price 6 As. Exclusive of Postage.*



1894.



# THE

# PRISONER OF CHILLON.

TRANSLATED INTO TELUGU VERSE

BY

**Srishtu Jagannadhasastry.**

First Grade Pleader, Rajahmuudry.

శ్రీ శ్రేష్టు-జగన్నాథశాస్త్రి విరచితంబైన

## చిలా౯బంది అనుభ్రాతృసౌహృదము.

Printad at

Mr: DAMARAJU SIVARAMAYYA'S

SRI TRIPURA SUNDARI PRESS.

**Ellore.**



*Price 6 As. Exclusive of Postage.*



1894.



# PREFACE.

'Byron's Prisoner of Chillon' like Gray's Elegy, is one of the most popular pieces of the English Poetry ,and every University student is familiar with it. To cherish an idea of translating such a work into a vernacular, which is Telugu in this case, is therefore, an excusable ambition. Though it is not an easy task to trnslate into Telugu verse successfully, I have tried my best to render it as literally and as idiomatically as possible. To give the reader an oppertunity of comparing the translation with the original readily, I have given the number of each stanza in Roman figures and of the lines in ordinary figures in the body of the work. I have, however great defidence in publishing the work and any suggestions offered by the kind public will be thankfully eceived.

13th May 1894. S- JAGANNADHAM.

# శుద్ధపత్రిక.



| పుట. సంఖ్య. | పద్యము. సంఖ్య. | పాదము. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|---|
| ౫ | ౧౪ | ౧ | ఢెమ | ఢేమ. |
| ౮ | ౩౩ | ౩ | నుల్లాసముల. | నుల్లాసమున. |
| ... | ౩౫ | ౧ | వాఁచు | వాఁడు |
| ... | ౩౬ | ౪ | సంతసంబురఁగ | సంతసంబునఁగ |
| ... | ౩౮ | ౧ | డడగి | నడగి |
| ౯ | ౪౨ | ౧ | జేరసాల | జెరసాల |
| ౧౦ | ౫౨ | ౩ | స్త్రు | స్రి |
| ౧౨ | ౬౫ | ౧ | ఎవఁడో | ఎవండో |
| ౧౩ | ౬౭ | ౪ | ఎండిపోయ | ఎండిపోయె |
| ౧౯ | ౯౮ | ౪ | కాడో | కాదో |
| ౨౦ | ౧౦౨ | ౪ | యండ | యుండ |

శ్రీరస్తు.

# చిలాన్‌బంది

## అను, భ్రాతృసౌహృదము.



కం॥ సిరికిరవగుసీమన్గవి।
వరుఁడుమహాఖ్యాతిపరుఁడుభైరననంగాఁ।
బరగునతఁడురచియించిన।
పరమాద్భుతకావ్యమాంధ్రభాషరచింతున్॥

వ॥ అవధరింపుఁడాకవివరుండు శతకృతికర్తగాఁబ్రఖ్యాతినొందెనాకావ్యంబుల "చిలాన్బంది" అనునది సర్వరసోపేతంబై సకలజనానందకరంబై విలసిల్లు నాకావ్యప్రారంభంబున స్వేచ్ఛాభివర్ణనంబు నా చిలాన్బందిగప్రశంసయు నాతండుగావించెనెట్లన్న॥౨॥

శా॥బంధానీకముగట్టఁజాలనిమనో। భావిజ్ఞనిత్యాత్మ! ని।
ర్బంధంబేమియులేకక్రాలెదు "స్వతంత్రస్వేచ్ఛ"! కారానివే।
శాంధంబందుఁబ్రకాశమందెదవుస్వీయావాసమచ్చోఁగనన్।
బంధాతీతహృదంతరంబగుటనిర్బంధిపవీబంధముల్॥౩॥

గీ॥ అట్టిదానినిబంధింపనలవియైన।
చేమికలదువిచారింపనిలఁద్వదీయ।
గాఢనిశ్చలబద్ధరాగంబొకండు।
దక్కస్వేచ్ఛానుగామిస్వాతంత్ర్యమహిమ॥౪॥

మ॥ భవదాత్మప్రభువుల్స్వతంత్రగరిమా! బద్ధాంఘ్రులై యార్ద్రులై।
పవలుంగాననిమిద్దెలో మెలఁగుచో బందీగృహాంధంబునన్।
భవదర్థంబగుహింసమేజయముగా భావంబునన్లోకమెం।
చవియుద్దేశమునింపెవాయురయ పక్షశ్రేణిసత్కీర్తితోన్॥౫॥

సీ॥ పావనాలయమనీబందిగంబుచిలాన బలిపీఠమానీదుపాదు సేల।
బానివర్డనునొకఁడు పావనపురుషుండు బహువత్సరములందుబాధఁబడియె।
నడుగులరాపిడినరుగునంఘ్రులచిహ్నమశ్మమయీస్థలినసటఁబోలి।
దిగియంటునందాకతిరిగెనాతండట నుసురెల్లనచ్చటనుడిపికొనుచు॥

గీ॥ అట్టిపదపద్మచిహ్నములణగిచెరగి।
పోకనిలుచుండుగాత నేఁపెద్దునచటఁ।
గ్రుద్ధదుష్టాధిపాలకక్రూరకర్మ।
నీశునకుఁజూపిఁరవిమొరలిడుచునుంట॥౬॥

వ॥ ఇట్లొకవివరుండు దొలుత స్వేచ్ఛాభివర్ణనంబును గారాప్రశంసయు గావించి తొల్లి జర్మనీదేశంబున బానివర్డనువానిజనకుండు పూర్వమత పరిత్యాగంబును నూతనమతావలంబనంబునుగావించిన నప్పటిపరిపాలకులది సహింపజాలకవానిషట్పుత్రసహితంబుగనానాహింసలపాలుజేసిరి జనకునివధించిరి-యార్వురిభ్రాతలలోనొకనిని నగ్నింబడఁద్రోసిరి ఇద్దర రణాంగణంబునఁగూల్చిరి మువ్వురఁజిలానను ఘోరాకారకారాగృహంబున శృంఖలాబద్ధులం జేసి వైచిరియామువ్వురిభ్రాతలలోనిద్దరాచెరసాలమృతినొంది యచ్చటనసమాధిగనిరి తక్కినయొక్కరుండు బానివర్డనువాడు ప్రాణావశిష్టుండై యెట్టకేలకువిడుదలంగాంచి యాతండాబందిగంబున ననుజద్వయ సహితంబుగఁ బడినపాట్లువివరించినట్టు బైరనుకవివరుండు చిత్రవిచిత్రకల్పనా చాతురీ మాధురీధురీణంబుగవిరచించిన "చిలాన్ బంది" అనుభ్రాతృసౌహృదంబునకుఁగథాక్రమంబెట్టిదనిన॥

## కథాప్రారంభము.

I ౧—౨౬

ఉ॥ నాతల తెల్లనయ్యెనయినన్మదుకుండను గాను నేహతా।
ద్భుతత చేతకొందరకుఁ బెంపరి యొక్కట రాత్రియందు చం।
ద్రాతపతుల్యమై పరగునంద్రుతదీయశిరోరుహంబు సం।
ఘాతము నా తెరంగది యుఁ గాదు వినన్ గదు నద్భుతంబగున్॥

గీ॥ వంగెనంగకములు పాటువలనఁ గాదు।
జననమాదిగ నే చెరసాలఁ బడుట।
నటనికృష్టపు విశ్రాంతి నంది త్రుప్పు।
పట్టినట్లు గనవి పాటవంబు దప్పి॥౨॥

గీ॥ జగతిలో పలవాయు ప్రసారభార్క।
రశ్మిదర్శనసుఖశుభవ్రాతమునకు।
భోగబాహ్యత నోచిన పురుషులందు।
నొకఁడుఁగా నుండు విధి విధియొసగె నాకు॥౩॥

వ॥ ఇట్టి శుభనిషేధంబులకుం గారణం బెట్టిదనిన॥౪॥

ఉ॥ లోకములో నరుండు మదలోభములం జరియించి దుష్కృతా।
స్తోకతఁ జేసి శిక్షబడి త్రోయఁబడుం జెరసాలఁ గాని నే।
నొకడు భక్తి నా జనకుఁ డొప్పని పూనుమతావలంబనన్।
జేకొని బందెసంకెలలఁ  జిక్కి వరించితి జావు ధీరతన్॥౫॥

క॥ ఆజనకుఁడు నూతనమత।
పూజావిధులోలఁ దాల్చి పూనికె వానిన్।
భాజనమని విడనేరక।
రాజిల్లెం గారతనసువు రాలఁగ మృతుఁడై॥౬॥

క॥ చీకటి కారాగృహమున।
నాకతమునఁ జేసి యమ్మహాత్ముని తనయుల్।

వీకరవాసముసేసిరి।
తోకమునకుఁదండ్రికీడుతోడరకయున్నె॥౭॥

గీ॥ తొలుత నేడ్వురమిప్పుడుఁ నిలచెనొకఁడు।
వారిలోపలయావనమారకుండ।
నార్వురఁడగిరివార్ధక్యమునఁదొకండు।
గడచెనాద్యంత మొకరీతిగడపికొనిరి॥౮॥

గీ॥ క్రొత్తసిద్ధాంతములకతికోపఘూర్ణ।
మానమానసులైనయుగ్రాగ్రజనులు।
వేడ్కఁదొడరించుహింసకు వెనుకఁదియక।
నిలచియుండిరహంకారనిరతులగుచు॥౯॥

గీ॥ అగ్నినొకఁడుద్ధరాహవభూమిలో।
రిపులులేడటంచుని త్తేలాడు।
నీశుకొరకుజనకుఁడీల్గినగతిచచ్చి।
ప్రాణమిడిరివారుభక్తికొరకు॥౧౦॥

క॥ కారాగృహమునముష్వర।
మారయుద్రోంగఁబడితిమటవారలలో।
ఓరిరియిద్దరుదుర్దశ।
నీరీతిందుదకుఁజిక్కి తేనొకరుండన్॥౧౧॥

II ౨౭—౪౭

శా॥ ప్రాచీనోన్నతకుడ్యసంవృతగుహాభ్రాంతిప్రభూతాఢ్యమై।
యాచిల్లాన్ జెరసాలగ్రాలునటమధ్యన్ గొప్పలై తెల్లనై।
తోచున్ స్తంభములేడుకోణములతోఁదోరంబులై చూడ్కికిం।
దోచుంభానుకరంబొకండసదుమైధూమక్రియంబందినాన్॥౧౨॥

గీ॥ మందమైనట్టికుడ్యంబుమధ్యమందు।
బీటువారినరంధ్రంబువెంటదూరి।

మార్గమేదిన కిరణంబు మసక కాంతి।
చేతఁగను వెలుఁగొందె నా చెరగృహంబు॥౧౩॥
కే॥ మిగులఁ జెమ్మగల్గు మేదినిపైఁ బ్రాకు।
లాచుతరణికిరణము చటనమరెఁ।
బ్రభూమిమీదఁబైనుండిపడియటఁ।
గ్రాలురిక్క వెలుఁగుకరణిఁ దోఁప॥౧౪॥

వ॥ మరియును॥౧౫॥

క॥ ఒక్కొక్క కూచమందున।
నొక్కొక్కటియును పకడీయమందునుద్రుఢమై।
యొక్కొక్క కడెయమందున।
నొక్కొక్క గొలుసిను పసుఁడునుగ్రదాళిన్॥౧౬॥

క॥ ఆయినుము నేహాయస్థిన్।
గోయుంది నీపై మసుగుల గ్రూరాకృతితో।
నాయినుపపండ్లులోదిగి।
నాయీయంగకములందు నాటుకపోయెన్॥౧౭॥

గీ॥ గంట్లచేఁ బడ్డ మచ్చలీ కాయమందు।
మాయక వినిల్చు క్రొత్తై మదికి దోఁచు।
నీ దినంబులు కడఁజేరి యేగువరకు।
భారమైతో సెనవియ చెప్పఁ బకునిపుడు॥౧౮॥

ఉ॥ భారములయ్యెఁ బ్రొద్దుపోవుచున్ బహు వత్సరముల్ గనుంగొనన్।
దూరములైన పాడుకను చోయుకీసేదినముల్ గణింపగా।
నేరను వత్సరంబులవి నేటికి నిన్ని గతించెనంచు నే।
నారసి చెప్ప దీర్ఘ గణనావళి విస్మృతినొందిపోయినన్॥౧౯॥

గీ॥ లెక్క మరచితి నాత మ్ముఁడొక్కఁడుండి।
కుంది మృతినొందిధామణిఁ గూలినపుడు।
బ్రతికి జీవచ్ఛవంబన వానిఁ బ్రక్క।
కదల నేరక పడియున్న కాలమందు॥౨౦॥

## చిలాన్‌బందీ అనుభ్రాతృసౌహార్దం.

III ౪౮—౬౮

క॥ ఒక్కొక్క స్తంభమునమము।
నొక్కొక్క నిశ్శృంఖలములనొగిగట్టిరరుల్।
లెక్కకుముష్వురముండియు।
నొక్కకరము వేరు వెరనుంటుమియచటన్॥ ౨౧॥

గీ॥ ఒకరియడుగైనఁగదలంగనోపలేము।
కడగియన్యోన్యవదనముల్ గానలేము।
మమ్ముగాత్రిత్తఁగఁజూపునామసక కాంతి।
యచటలేకున్నవై వర్ణ్యమందియయున॥ ౨౨।

గీ॥ ఇట్లుకలసియుమరియుప్రత్యేకముగను।
హస్తములఁగట్టుపడిహృదయములఁగలసి।
యేకమైయట మెలగెదునేముపుడమిఁ।
బంచభూతాప్తికిని బేదవడితిమకట॥ ౨౩॥

ఉ॥ ఆదశనైననొండొరుల యార్తనినాదములాలకించియా।
శాదరవాక్కులాడి యితిహాసముఁజూపిపురాణవీరగా।
నోదయముల్ఘటించి మరియొండొరుచిత్తములుల్లసిల్లఁగా।
నాదరఁమొప్పఁజేతుమదియాత్మవిషాదముకొంతవాపఁగన్॥ ౨౪॥

గీ॥ అదియుగూడనిరుత్సాహమయ్యెఁదుదకు।
మాగళధ్వనిరసంబైగతించె।
మున్నువలెఁగాకగద్గదమునువహించె।
ననుచుఁదెలిపెను జెరప్రతిధ్వనులయులివు॥ ౨౫॥

క॥ అనినదంబశ్రావ్యం।
బైనామదిఁదోచెనూహయగునోయేమో।
మానైసర్గికనదముఁగ।
నానినమదోచదమ్యోనాత్మకునాకున్॥ ౨౬॥

IV ౬౯—౯౧

గీ॥ నేనుబెద్దనుమువ్వురిలోనఁగాన।
వారినోదార్చియుత్సాహపరులఁజేయ।
వలసినదినేనయోపినవరకునట్లు।
చేసితినివారుఁదమవంతుఁజేసినారు॥౨౭॥

క॥ కడవానినాదిజనకుఁడు।
గడుఁబ్రేమఁగారవించు గనుబొమలచ్చుం।
బడినట్లుతల్లివాతఁడు।
వడసిగగననీలదృష్టిఁ బడసినకతనన్॥౨౮॥

గీ॥ వానిఁగూరిచికటకటఁబడితినాత్మ।
నట్టివిహగంబుదురవస్థనట్టిగూట।
నుంటఁగనుగొంట నెటువంటియుపలమనను।
గరిగినిజముఁగఁగటకటఁగనకయున్నె॥౨౯॥

గీ॥ గరుడపోతంబు స్వేచ్ఛమైతిరుగునాడు।
పొడుచురవిఁగాంచియాహ్లాదమునువహించు।
కరణినేమును స్వేచ్ఛమైక్రాలునాడు।
పవలుగనుగొన్నరమ్యమైపరగినాకు॥౩౦॥

క॥ ఆపవలువలెనెరమ్యం।
బైపరగెనునాడుచిన్ని యనుజుండరయ।
న్నాపవలువసానముఁగన।
నోపదువేసంగియంతయుడిగినదనుకన్॥౩౧॥

క॥ ధ్రువగతరవిక్రుంకడువే।
సవియంతమునందువరకుశ్రాంతింపనిదీ।
ర్ఘవికాసపువేసవియగు।
ధవళహిమాంబరదినేశ తనుజూతంబై॥౩౨॥

గీ॥ కాననాతండునిర్మలమానసుండు।

చిలాన్‌బందిఅనుభ్రాతృసౌహార్దం.

కాంతివంతుండు నైసర్గికమున నెప్డు।
మిగులనుల్లాసములనుఁజూపఁగవలెఁడు।
కంటనీరన్న దెఱుఁగఁడే కారణమున॥ ౩౩॥

ఉ॥ ఆతనికంటనశ్రువులొకప్పుడుఁగల్గవుగల్గెనేనియుఁ।
జాతదయార్ద్రచిత్తమున సంభ్రమమొందుచునాప్తునాపదా।
వ్రాతమునంగనుంగొని నివారణసేయమినప్పుడశ్రుసం।
జాతఝరీప్రవాహముల చాడ్పునసాగునిహోత్తినోర్వమిన్॥ ౩౪॥

V ౯౨—౧౦౬

గీ॥ మఱియు రెండవవాఁడు నిర్మలమనస్కుఁ।
డయ్యుఁదనజాతివారితోనసినెదుర్పఁ।
దగినవాఁడుగనిర్మించె ధాతవాని।
సంగరంబుల నాతనిసాటిలేఁడు॥ ౩౫॥

ఉ॥ కాయపటుత్వశౌర్యములు గల్గి [illegible] లో।
సీయిలఁగల్గి శూరజనులెల్లనుఁ [illegible]।
మాయఁగఁగూల్చునొక్కరుఁడమానుషశక్తి [illegible]।
పాయకనిల్చి కట్టుదుఁటఁ బ్రాణములిచ్చును సంగరంబునన్॥ ౩౬॥

గీ॥ అట్టిశూరుండు వానికినకట యిటుల।
గొలుసులను గట్టుపడియుంటకుండుఁ జుంట।
యతనప్రకృతికిఁదగినట్టి దుచ్చుగాదు।
శృంఖలధ్వనిచే ధృతిచెడెనతండు॥ ౩౭॥

గీ॥ అతనిసారంబులోలోన నడఁగిపోవఁ।
గన్నులారంగఁగటకటా కన్నకతన।
నిజముగానాదినీరీతినీకసించె।
నేమొయనుచును బుద్ధినూహించినాఁడ॥ ౩౮॥

గీ॥ ఐనమాప్రియమైనగృహాంగణమునఁ।
బుట్టిపెరిగినవారిలోఁబోకనిలచి।

యున్నవారికిఁబ్రోత్సాహముప్పతిల్ల।
లేనిప్రోత్సాహమేనుగల్పించుకొంటి॥ ౩౯॥

గీ॥ అతడుకొండలలో వేటలాడువాఁడు।
అటకుసిరిసివృకము వెంటాడినాడు।
వానికీ చెరదు స్తరవార్ధియయ్యెఁ।
గాలిసంకెలకడఁగొట్టుకష్టమయ్యె॥౪౦॥

VI ౧౦౭—౧౨౫

వ॥ ఇట్టిసకలసద్గుణసంపన్నులయిన నాయనుజులతో నన్నుం బంధించినచిలాక్ బందెగంబు ఘోరం గట్టిదనిన॥౪౧॥

గీ॥ ఆచిలాన్ జేరసాలకుడ్యములనంటి।
లెమను నామంబుఁబ్రఖ్యాతినమరఁగన్న।
యొక్కరమ్యసరోవర మొప్పుచుండు।
వేయియడుగులయెత్తునవీచులలర॥౪౨॥

గీ॥ దానివారాసికూడియేతావునందుఁ।
బారుచుండునాయడనూరుపదులయడుగు।
లెత్తుగానుండుమాపైసినిచట మేము।
మెలఁగుచీకటివిలువంకముద్దైకలదు॥౪౩॥

గీ॥ ఆచిలాన్ జెరహొసుసి తొట్టాలకంబు।
నుండికొలచినకొలచేతనొప్పుచుండె।
వేయియడుగులుగలలోతునవీచిచుట్టు।
తిరిగిసేవించునట్టులాబుఁజుదోచె॥౪౪॥

క॥ గోడయుఁబ్రకరితరంగముఁ।
జోడైచరకవనొనర్చెఁజోద్యాస్పదమై।
చూడఁదటాకముక్రిఁగడఁ।
బూడనిజీవత్సమాధిపోలికెనుండెక్॥౪౫॥

గీ॥ అనిలవేగోపహతినిర్మలాంబరమున।
హిమపతుషారంబుచలివేళనెగసియాడ।
గలుగగుగోనగోనరోదరేపవలుచెలంగి।
తలలపైమోగ్రనెడలేనియులివులింటి॥౪౮॥

గీ॥ మీదఁబడఁగంటిఁగడ్డీలమించివచ్చి।
యపుడుచెరసాలయశ్మమెయుల్లలాకె।
నూపుదగిలియుఁజలియింపకుంటిమఁదని।
శ్రమవిమోచకమృతిసంతసంబునీదె॥

VII ౧౭౬—౧౮౩

వ॥ ఇంకనాపెద్దతమ్ముని పాటువివరించెద॥౪౮॥

గీ॥ నాదుపెదతమ్ముఁడుకృశించినాడటంటి।
వానిఘనధైర్యమెల్లసుబాసెనంటి।
భోజనపదార్థములసహ్య బుద్ధిగొల్ప।
మానివేసెనుభుజియింపవానినతఁడు॥౪౯।

గీ॥ భోజనముఁజేయనదిమేముమితకకూడు।
కూరయనిగాదుమృగయులకూడుఁగుడువ।
మాకునలవాటుగలదభిమానమేల।
వానివిషయంబుమాకేమివాంఛలేదు॥౫౦॥

గీ॥ కొండమేకఁబితికకుతుకముతోఁదాగ్రవు।
పాలబదులుపరిఘపంకయుక్త।
మైనజలముమాకునానంగఁగలిగెఁబో।
యచటనున్నకాలమందునకట॥౫౧॥

ఉ॥ మాకటనిద్దరొట్టెయొకమానవుఁడీయిలనన్యమానవా।
నీకముగొడ్లకైవడికనీతినయోమయకందరంబునన్।
గాకబిగింపఁగాఁదొడఁగుకాలమునుండెసహస్రవత్సరా।
నేకనిబద్ధశృంఖలజనేతృణవారిమునింగెఁబోకనన్॥౫౨॥

గీ॥ కానియువియేమిటికివానికేనిమాకు।
నైననాతనిహృదయంబునంగకములు।
నెండికృశియింపనివిగావుహేతుకములు।
అతనివైఖరియొకవిధమైచెలంగు॥౫౩॥

క॥ గరినిలువుసానుతలముల।
కరిగియదేచ్ఛావిహారమటసల్పుటకై।
యరికట్టుగల్గెనేనియు।
సరిపడదాతనికిరాజసదనమునిలువన్॥౫౪॥

గీ॥ తడవిఁకేటికినిజమునుదాచనేల।
వాఁడుమృతినొందెనేమందువానిపాట
కన్నులారంగఁజూచియుఁగడఁగిశిరసు।
వ్రాలిపడకుండఁబట్టికోఁచాలనైతి॥౫౫॥

ఉ॥ కాలముతీరిచచ్చుచెలికానికరంబునునాకరంబునన్।
జాలఁగనైతెఁబట్టికొనఁజచ్చినపిమ్మటనైనబంధముల్।
కాలివిరెండుగావిరగఁగట్టిగనేకొరకంబ్రయత్నముం।
జాలఁగఁజేసినప్పటికిసాగకపోయెవృథాశ్రమంబుగన్॥౫౬॥

ఉ॥ ఆతఁడుచచ్చికూలిపడెనప్పుడుబంధవిమోచనంబుగా।
నాతనిమాగుహాంతరమునందచెమర్చెడుమట్టినిట్టటుల్।
చేతులఁద్రవ్వితీసియొకచెంతనుమిట్టసమాధిగట్టిలోఁ।
బాతిరిపూడ్చిపెట్టిరిశవంబున్నునిర్దయులైనశాత్రవుల్॥౫౭॥

క॥ వారిజమిత్రునిరశ్ములు।
పారెడునొకచోటశవముపాతుండనుచున్।
వారలఁగానుకగానేఁ।
గోరితినాకోరికచనియెఁగోరమాలినదై॥౫౮॥

గీ॥ జన్మమాదిగస్వేచ్ఛానుసారముప్ప।
వెలయుమానవుఁజచ్చినపిదపనైనఁ।
బాదుబందెగముననిట్లుపాతఁజనద।

టంచుఁదలపోసితినొకింతనాత్మనపుడు॥౫౯॥

వ॥ అయిననదివ్యర్థంబైనతలంపయ్యె॥౬౦॥

గీ॥ వేడుకొనిననునాకోరిక-విఫలమయ్యె।
నట్లుకోరకయుండుటెయర్హమగును।
వారునిర్థయులైనవ్విపరిహసించి।
పాతిపెట్టిరియచటనేవానినకట॥౬౧॥

క॥ మేమంతవిశేషముఁగాఁ।
గామముతోఁబోకమున్నుగౌరవమొప్పన్।
ప్రేమించినజీవునిపై।
నీమట్టినశాద్వలంబునిడిరిచదరుగన్॥౬౨॥

గీ॥ వానివిడఁగొట్టుశృంఖలవ్రాతమరయఁ।
బాతిపెట్టినశవముపైఁబడియుటుండె।
నరయనదిదానిపైగోరియనఁగఁబరగె।
ఘోరహత్యార్హమైనట్టిగురుతనంగ॥౬౩॥

VIII ౧౬౪—౨౩౦

వ॥ ఇట్లునాపెద్దతమ్ముండు మృతినొందితీరెనింక నాచిన్నతమ్మునివి
ధంబు వినుపించెదవినుఁడు॥౬౪॥

పంచపాదిసీసము॥ ఎవ్వఁడుమావారికెల్లరకిష్టుఁడై యెవ్వఁడుపువ్వును
రీతినింపొసంగె। నెవ్వఁడుజన్మంబునెత్తినదాదిగాఁ గడునబ్బురం
బునఁగ్రాలినాఁడొ। యెవ్వఁడుమాతల్లి యింపైనవదనారవింద
మచ్చుపడంగవెలసినాఁడొ। యెవఁడువంశముహారికెల్లనుగడుసా
రియైప్రేమకాస్పదమయినవాఁడొ। యెవఁడుమతార్థమైఁయొల్గిన
తండ్రికి నధికతమంబైనయభిమతంబొ॥

గీ॥ నాపరామరికకుఁదుదినరుఁడెవఁడొ।
బంధమోక్షముఁగనిసుఖప్రాప్తినెవ్వఁ।

గోరుచుంటినాయాతఁడీకుర్రవాఁడు॥౬౪॥

క॥ నైసర్గికంబా లేకను।
రోసముపుట్టించినట్టిప్రోత్సాహముచేఁ।
బూసికొనితాల్చుధైర్యము।
భాసిల్లెన్వానిమదినివాడకయింకన్॥౬౫॥

గీ॥ ఆతఁడరయగిరీంద్రధైర్యాన్వితుండు।
యట్టివాఁడునుమదిహతుఁడైకృశించి।
దినదినంబునుగాఢపైఁజివులుదవిలి।
యెండుసస్యంబుకైవడినెండిపోయె॥౬౬॥

గీ॥ అకట! దైవమ! ఘోరంపుటడలుతోడ।
కన్నజీవాత్మపక్షులోనరఁదాల్చి।
యెట్టియాకృతినేగతినేనిఁబొంది।
చూచుచుండంగనేగదెపెంజోద్యఁగనఁగ॥౬౭॥

సీ॥ ఘోరాహవంబునఁగూలిరక్తములొల్క నేగఁబోనదిగంటి నీక్ష
ణముల। నుద్రిక్తకల్లోలముత్తుంగమై పొంగి పొరిగడునంబుధిపీచి
దోడరి। యల్లాలాడించుచోనటఁ జచ్చిపోద్యానిఁ గన్నులారంగనేఁ
గంటిమరియు। జాడ్యపీడితుఁడైపిశాచకృతివహించు భయచిత్త
విభ్రమపాపిఁగంటి॥౬౮॥

గీ॥ నైననవియెల్లచిత్తభయానకంబు।
లిదియొయటువంటిభ్రమమిశ్రమేమిలేని।
శుద్ధకష్టంబుదుఃఖంబుచూడఁజూడఁ।
జాగుగానైనఁజాపునిశ్చయముకొనుట॥౬౯॥

క॥ అక్కటవాడెనుదేహం।
బెక్కుడినెమ్మదియొమరియుఁబెక్కుడిశాంతం।
బెక్కుడిమానముతాలిమి।
యెక్కుడిదోకలిగెఁజిక్కుటింపైతోఁచెన్॥౭౦॥

గీ॥ వెతలఁజెందియుబాష్పములిఁడువకున్న।

మిగులదయయును నెనరునుమీరునట్టి।
హృదయమువఁదానుబోయినపిదపనుందు।
వాగిక్లై పొంజెవలవనివంతయతఁడు॥ ౨౧॥

। ఇట్టిదుర్దశనున్ననెవ్వానిచెక్కిళ్ళ కెంజాయగోరికిఁగేళియయ్యె।
నిద్దంపుచెక్కిలినిగనిగల్పిరసించె నింద్రాయుధస్ఫూర్తిమేపుతరిగి।
మెల్ల మెల్లఁగబోవుమెలపునఁదళతళ మించులకనుకాంతిమించితొడరి।
వెలిగించెఁజెరసాలవిస్మయంబుఁగనట్టిమానిసిసణుగులమాటయొకటి॥

గీ॥ పైనబలుకఁడునిట్టూర్పునైననిడడు।
కనియునిట్టియకాలసంఘటనతనకుఁ।
గలిగిననునూత్మవిశ్వాసబలముచేత।
సహనముననోర్చెనెట్టికష్టములనైన। ౨౨॥

గీ॥ మంచిదినములుకలవన్నమాటకొంత।
యడఁగునాయాసనిలిపెడునాసకొంత।
పలుకునాతఁడుగొణిగెడుపలుకుతోఁడ।
మౌనమగ్నుఁడనైనేనుమ్రానుపడఁగ॥ ౨౩॥

గీ॥ అందరునునష్టమైపోయిరకట! యీతఁ।
డొక్కఁడున్నాఁడుగదయనియూహతోఁడఁ।
దనరవీఁడునుజివరకుఁదక్కఁడాయె।
సనెడుతుదిచింతయెక్కుడైయాత్మఁగలచె॥ ౨౪॥

గీ॥ దుర్బలంబౌటమిక్కిలితూలుప్రకృతి।
సడలివెడలెఁడునిట్టూర్పుసన్నమయ్యె।
నంతకంతకుదీర్ఘమైయడఁగిపోయె।
వెడవెడఁగఁదోఁచెనాయదియెడపదడప॥ ౨౫॥

॥ వీనులొడ్డితిఁగానివిందునేమోయని వినజాలనైతిననినదమేమి।
భయవిహ్వాలతజేతబలువరించితిగానిపలుమారుపిలచివబలుకఁడాయె।
నిస్పృహాయనుమాటనేనెరింగితిగానిభ్రాంతిపాశముబుద్ధివదలదాయె
బిలచితిఁబలికిననులివ్వువిన్నట్టుల వీనులఁబడెఁగానివిభ్రమంబె॥

గీ॥ గొప్పలంఘనముననాడుగొలుసుఁద్రెంచి।
కొనిరయోద్ధతిఁజనితినాతనిసమీప।
మునకునైననుఫలమేమిమున్నెకాలుఁ।
డసవుఁగొనిపోయెనిఁకనటనాతఁడేడి॥౭౬॥

గీ॥ అక్కటా! వానిఁగనుఁగొననైతినేచట।
నేనొకఁడనుంటిఁజీకటినెలవునందు।
నేనొకండనఁబ్రతికితినేనొకండఁ।
బాదుచెరతడిశ్వసనంబుఁబడయుచుంటి॥౭౭॥

సీ॥ అంతరించుమదన్వయావనిజమునుండిపడకుండనన్నాగుతోడిమెయి
తఁడు। ఆద్యంతరహితమైయలరుననంతకాలాత్మమునకునాకునడ్డ
గట్టు। ప్రియతమంబునుజివరికిఁజిక్కినిలచిన యొక్కటేయైనయా
యుక్కకొలికి। తగియూడిపడిపోయెవగవంగఁబ్రాణాంతకంబై
నయుట్టితానంబునందు॥

గీ॥ నాసహోదరులిద్దరునష్టమైరి।
యొకఁడిలాగర్భమందుననొకఁడుపైని।
యసువులిడిపడియుండిరియనదలగుచుఁ।
గాలధర్మంబునెవ్వారుగడపఁగలరు॥౭౮॥

గీ॥ కదలకున్నట్టియాతనికరమునాదు।
కరముచేఁబట్టిచూచితికటకటా! యిఁ।
కేమియున్నదిచలిముద్దయెంచిచూడ।
నట్టిచలిముద్దనాకరంబయ్యెనపుడు॥౭౯॥

సీ॥ కదలంగనటునిటుఁగదలయత్నముసేయఁ గాయంబునబలంబుగలు
గఁదాయె। నింకసజీవుఁడనేయనిమాత్రంబుబుద్ధిలోనొకయూహ
పుట్టెఁగనఁగ। నీప్సితార్థములిఁకనెన్నటికినిగల్గ వనునిశ్చయముమ
దికైనయప్పు। డిట్టివెఱ్ఱితలంపుచేయందుబుట్టును జావకుండితినేల
చావలేదొ॥

గీ॥ తెలియజాలనునాకునీయులనుబ్రతుక।

నాశలేమియులేవిఁకనాత్మయందు।
గలదువిశ్వాసమొక్కటెయిలనునాకుఁ।
గానియదిచావనీదుస్వఘాతవిధిని॥౮౦॥

గీ॥ తత్క్షణంబుననేజడత్వంబుగంటి।
నప్పుడేమైతినోగానియిప్పటికిని।
దెలియఁజాలనుగాలియువెలుఁగుదోలుత।
నణఁగెఁజీకటిసహితమునణఁగెఁబిదప॥౮౧॥

IX ౨౩౦—౨౪౦.

గీ॥ చిత్తవృత్తినశించెనుజేష్టదక్క।
నింద్రియజ్ఞానమంతయునిమ్ముదప్పె।
శూన్యమయ్యెనుసర్వంబుఁజూడనచటి।
రాలలోపలనేనొక్కరాయినైతి॥౮౨॥

గీ॥ మంచుముంచినపొదలేనిమలలమాడ్క।
జ్ఞానమజ్ఞానమునురెండుగానకుంటి।
సర్వమత్తరిశూన్యమైశైత్యమయ్యె।
మరివివర్ణముఁగాఁదోచెమానసమున॥౮౩॥

సీ॥ కనుఁగొననదినిశకాదదిపవలును గాదుభారములైనకన్నులకును।
భారమైతోచెడుకారాలయములోనికనుమాపుచూపునుగాదుచూ
డ। నావరణముఁగ్రమ్మింగునాకాశశూన్యంబు స్థానంబునెరుగనిస్థావ
రంబు। లేవునక్షత్రముల్ లేదుధారుణితెరిలేదువర్ణంబులులేవులేవు॥

గీ॥ లేదుపరివర్తనములేదులేదుమేలు।
లేదుకీడువిచారించిచూడఁజూడ.
మౌనమునుమృతిజీవానుమానకుంభ।
కంబునిశ్చలభావంబుఁగలిగియుండె॥౮౪॥

గీ॥ గాఢనిశ్చలజాడ్యసాగరమునందు।
రూపమడఁగియపారమైచూపుమాసి।
ముగ్ధతనుదాల్చినిశ్చలతనువహించి।

యున్నయట్లయెయ్యేనేనప్పుడున్నరీతి॥౮౫॥

X ౭౫౦—౭౯౯

వ॥ ఇట్లునిశ్చలంబునజడభావంబుఁదాల్చి సర్వజ్ఞానశూన్యంబుననుం డఁగొంతకొకవడికి॥౮౬॥

క॥ కలకలరవములఁబలుకులు।
చిలుకుచువ్యథఁజెందునాదుచిత్తంబునకున్।
వెలుఁగిడువిధమునఁదెలివిడు।
పులుగొక్కటివచ్చెగానములువిలసిల్లన్॥౮౭॥

గీ॥ గానమప్పుడువిరమించెఁగాత్రిలెమరల।
వీనులెన్నడునటువంటివింతమధుర।
గానమాలించియెరుగవుగానఁగనులు।
హర్షవిస్మయములఁగృతజ్ఞాంచితముగ॥౮౮॥

క॥ విప్పుకొనిపారఁజూచితి।
నప్పుడుపొడగానఁజాలనైతినిధరలో।
ముప్పునకుఁబాలుపడికడుఁ।
దిప్పలుబడియుంటిననిమదింగుతుకమున్॥౮౯॥

గీ॥ మెల్లమెల్లఁగఁగ్రమమునసుల్లసిల్లెఁ।
దొంటిగతినిమదింద్రియస్తోమమరయఁ।
జూడఁగలిగితిఁజెరసాలచుట్టునున్న।
గోడలనునేలమున్నట్టిజాడనపుడు॥౯౦॥

గీ॥ గోడలోనున్నరంధ్రంబుగూడదూరి।
మిణుకుమిణుకనివెలిగెడుమిత్రురశ్మి।
నచటఁగంటినిమున్నటియట్లపోకఁ।
బులుగునుంగంటినారంధ్రమునఁజొరంగ॥౯౧॥

శా॥ ఆరంధ్రంబునదూరివచ్చిహృదయాహ్లాదంబుగామచ్చికన్।
జేరన్వచ్చెనుపక్షిరాజమటసుంజేయూఁకకున్లోనుగాఁ।

గారామందిరమందుఁజెట్టుపయినంగారాబుతోఁదొల్లిసం।
చారంబందినరీతిఁగ్రుమ్మరెమహా సంతోషమొప్పారఁగన్॥౯౨॥

క॥ నీలచ్ఛదములరమ్యం।
బై లీలఁజరించునావిహంగముమదికిన్।
గేలిమొనర్చుచుగీతా।
జాలామునాగానంబు సేసెస్వరయుక్తముగన్॥౯౩॥

శా॥ ఆసంగీతమువీనుదోయికొసఁగన్ హర్షంబువేసుద్దులన్।
భాసిల్లం బ్రకటించెనాకొరకఁ జెప్పందల్చెనో యేమొకో।
యీసాదృశ్యముఁగల్గుపక్షినిలమున్వీక్షింపఁగాలేదికే।
వాసంబందునఁగాననంచుమదిలోఁబల్మారునేఁదల్చితిన్॥౯౪॥

గీ॥ అదియునావలెసహవాసినాత్మఁగోరి।
వెతకుచున్నట్లుతోచెనామతికిగాని।
నేనుబడ్డట్టికష్టార్థమైనఁగాని।
పొందకుండుటనికఁ బ్రమాపులుగురేడు॥౯౫॥

క॥ నను నిలపైఁ బ్రేమించెడు।
జనులెవ్వరులేరటన్న సౌహృదభావం।
బుననను బ్రేమించుటకై।
చనుదెంచెం బోలుఁబక్షిచంద్రంబటకున్॥౯౬॥

సీ॥ ఆచెరచివరఁదానల్లనఁగూర్చుండె నుత్సాహమిచ్చెడునుచితగాన।
ములుపాడిచరియించె ముందటి స్తంభనజడభావములుమాన్పికడ
కుఁదెచ్చెఁ। బంచేంద్రియజ్ఞానపరిమఁగ్రమ్మరఁ గూర్చితలపోతబుద్ధి
కిఁగలుఁగఁజేసె। దానినివిడిచిరోతప్పించుకొనిపంజరమునుండినా
పంజరమునవ్రాల॥

గీ॥ వచ్చెనోగానియెరుఁగనువాస్తవంబు।
చెరవిధంబెల్లబాగుగఁజిత్తమునకుఁ।
దెలసియుండుటనీకదివలదటంచు।
బుద్ధిఁగోరెదనించులపులుగురేడ॥౯౭॥

సీ॥ అదిచూడదివినుండియాకాశపథమునఁబక్షివేషముఁధాల్చివచ్చినట్టి
అలపరామర్శికుఁడనిమదిభావింతుఁ గడచన్నమద్భ్రాతగరుణన
న్నుఁజూడంగదిగివచ్చినాఁడేమొయనికొన్నిమారులుదలచితి మన
మునందు। దుఃఖంబుహర్షంబుఁదోచునుఁదోడుగ నామాటమదికె
క్కినప్పుడెల్ల॥

గీ॥ దేవతుమియింపుమామాటతెలియకంటి।
బారిపోయెనుఁదుదకునాపక్షియప్డు।
మర్త్యఖగమనిద్యథనుఁగమదికిఁదట్టె।
కాఁడొవిడనాఁడిచనునెయాకరణిమరల॥౯౮॥

గీ॥ నన్ను రెండవపరియిట్లుఖిన్నుఁజేసి।
మరలనొంటరిగాఁజేసిమరలఁడఁతఁడు।
పాడెపైబెట్టినట్టిశవంబనంగ।
నొక్కఁడనయుంటినకటఁడనుకుఁదకట॥౯౯॥

సీ॥ ఒంటరినేనుంటిమింటిపైఁగనుపించు విడియొంటిమేఘంబు విధము
దోప। రవిప్రకాశింపంగదివియెల్లనిర్మలమై చెలంగఁగనొక్క
యంబువాహ। మఁటఁదోపనారయనాకాశదేవత మొగముచి
ట్లించుకన్బొమలమోడ్పు। గానెంతుఁగాదొ! యాకాశంబునీల
మైవిలసిల్లనవనిహర్షాప్తిఁబొదల॥

గీ॥ కార్యమేమియులేకుండకారుమబ్బు।
విడిదియొకచోటియచ్చటవెలయుటకును।
గతమొకింతయునైననుగానరాదు।
కొంతతరియిటుచననొకవింతగలిగె॥౧౦౦॥

XI ౩౦౦—౩౧౨

గీ॥ నాయవస్థకుబరివర్తనంబుగొంత।
గలిగెఁజెరపాలకులుజాలిఁగనిరినన్ను।
నందులకతంబునెరుఁగవార్త తెపరులు।

కష్టములకోర్చునభ్యస్తకరినమతులై॥౧౧౧॥

గీ॥ వినయనన్నుదయార్ద్రులైయాదరించి।
నాదుసంకెలవిడఁగొట్టినారువిడ్డ।
గొలుసునూడినమేకులుకుతలమందు।
నటఁబడియుండనందునరాదఁగలిగె॥౧౧౨॥

క॥ కందరముఁబోలునాచెర।
బందంబులులేకనాల్గుప్రక్కలనడుమన్।
సందులఁదిరిగితిదృష్టిం।
జెందినయంధుండుబోలెఁజిత్తంబలరన్॥౧౧౩॥

సీ॥ అంగలుచాచుచునదియెల్లతిరుగుచెవిడుదలగాఁగొంటివిస్మయము
గ। నొకప్రక్కనుండి యొండొకప్రక్కప్రక్కకుఁ బైకిఁగ్రిందికినే
నుచాకుచుందు। నప్పుడడ్డంబుగనంతటఁ దిరుగుదు స్తంభాల చు
ట్టునసంచరింతు। స్తంభమొక్కొక్కటి సరిచిఁజుట్టుచుబోయి తిరి
గిచేరుదుబయిల్దేరుచోట॥౧౧౪॥

గీ॥ మరియుఁదిరుగుచుననుజసమాధియుగము।
మట్టిచెక్కనలేకుండవట్టిపుంట।
దానిపైకాలుబడనీకతడవితడవి।
కడగితప్పించితిరిగితిఁగలతెమువినుడు॥

గీ॥ కడఁబరాకుననాకాలుపడనపూంత।
మానుగదవారిభూశయ్యలనుతలంపు।
లవుడుగలిగించునెగరోజునవిళగముగ।
నంధమయమయిభ్రమనొందునాత్మవిరిగి॥౧౧౫॥

XII ౩౧౮—౩౩౧.

గీ॥ గోడలోపలమెట్లుగాఁగొంతత్రవ్వి।
యెక్కనాధారమొక్కటినేరుపరచి।
కొంటియద్దానఁదప్పించుకొనఁదలంచి।

కాదునాకట్టియభిలాషగలనులేదు॥౧౦౬॥

క॥ మానవునాకారంబుల।
పూనిననుఙ్ప్రేమగాంచుపురుషులుచనియో।
తానమునఁబూడ్పఁబడరవి।
గానఁబలాయనముఁజేయఁగాఁగననైతిఙ్॥౧౦౭॥

సీ॥ ఇంకనాకేమున్నదీధరాతలమెల్ల నధికవిస్తీర్ణకారాలయంబు।
తనయులెవ్వరులేరుతల్లిదండ్రులులేరు చుట్టపక్కంబులుసూడలేరు
దుర్దశఁబాల్పడఁదోడెవ్వరునులేరుమదినదితలఁచిసమ్మోదముఁగంటి।
మదివారిఁదలపోయమతిచెడియున్మాద దశనొందుచుండుదుఁదప్ప
కుండ॥

గీ॥ గట్టికడ్డీలుగలసౌర్ణగండ్లదనుక।
పైకినెగఁబ్రాకియున్నతపర్వతముల।
గన్నులకువిందొనర్పఁగఁగరువుదీరఁ।
జూఁడఁగోరితివేడుకమైఁజోద్యముఁగను॥౧౦౮॥

XIII ౩౩౨.—౩౬౫.

సీ॥ అవినేనుగనుగొంటినిపితొంటిరీతినేకనుపించెమార్పేమిగానరాక।
నాశరీరముమారినలిగినవిధమున నవిపరివర్తనమందవాయె। వేవే
లవర్షముల్‌వెలిమంచుకప్పిన నెత్తైనగిరిరాజినేనుగంటి। నాక్రింద
విస్తీర్ణమైదీర్ఘమైక్రాలు సరసినొకటిఁగంటిసంతసమున॥

గీ॥ నీలజల 'రోను' నదిదరుల్‌నిండఁబారఁ।
గంటిఁగోసినచట్రూతికాలువలను।
విరుగుఁబోదరిండ్లఁదుముకుచునురుకులాడి।
పారువాహినిగుణగణధ్వనులువింటి॥౧౦౯॥

క॥ దూరమునరజతశైలము।
తీరునసితకుడ్యసమితిదీపించుపురం।
బారసిచూచితిసితతర।
మైరాజిలునోడచాపలల్లనఁజనగఙ్॥౧౧౦॥

సీ॥ పిమ్మటఁగనుగొంటిసమ్మదంబుననొక్క చిన్నదీవినిదానినెన్నఁద
రమె। కలకలలాడినాకట్టెదుటను గ్రాలి పచ్చికమిసిమిచేఁ బ్రబలు
చున్న। యొక్కదీవియఁగంటినొకతూరిఁగనుపించియదియదృశ్యంబయ్యెనంత
నరయఁ। జెరసాలనేలంతచిన్నదిగాఁజోచె విస్తీర్ణముననదివేడ్కమెరయు॥

గీ॥ దానిపైగొప్పవృక్షముల్ దనరుమూడు।
దానిపైఁగొండపయ్యేరుల్ దనరవీచె।
దానిచెంతజలంబులుతటుకుతటుకుఁ।
గొట్టుకొనుచును బ్రవహింపనట్టెగంటి॥౧౧౧॥

గీ॥ వింతవింతఁగఁగనుపించువివిధవర్ణ।
సౌరభాన్వితకుసుమసంచయములచటఁ।
గోమలంబుగవికసించిగుతుకమెసఁగఁ।
గుచ్ఛములఁ బ్రేలఁగనగొంటిగొట్లకొలది॥౧౧౨॥

క॥ పురిచుట్టుచుట్టితిరిగెడు।
పరిఖోదధినాడుమత్స్యపంజ్ఞులుగములై।
పరిపరివిధములనీదుచుఁ।
బరమప్రీతింజరింపఁబైపైగంటిన్॥౧౧౩॥

గీ॥ కంకమప్పుడు వేవీచుగాలికెదురఁ।
బక్షవిక్షేపములఁజూపి పరువులిడియె।
నప్పుడదిపరివెత్తెడునంతరయముఁ।
దాల్చియెన్నఁడుఁబోదంచుఁదలచినాడ॥౧౧౪॥

క॥ అప్పుడుబాష్పోదకములు।
చిప్పిలిప్రవహించెమనసుచిటచిటలాడెన్।
విప్పకయుండినసంకెలు।
లొప్పగవాయనుచుమదికినూహాకడంగెన్॥౧౧౫॥

గీ॥ ఏనుగ్రమ్మరఁదిగితిని స్వేచ్ఛఁబిదప।
నపుడునావాసమందున్నయంధకార।
మెక్కుడుగనాదుకనులపైచిక్కనగుచు।

భారమైనాశరీరంబుఁబయినఁబడియె॥౧౧౬॥

గీ॥ ఎవనిరక్షింపమేముయత్నించినామొ।
వానిఁబూడిచిపెట్టంగవైరిజనులు।
నూతనంబుగఁద్రవ్వినగోతిరీతి।
మదికిఁదోఁచెనుజెరసాలమరలదిగఁగ॥౧౧౭॥

గీ॥ గోడపైకెక్కినాయక్షిగోచరంబు।
లైనవివిధవినోదపదార్థసమితి।
గన్నులకుభారభావంబుఁగలుఁగఁజేయ।
నట్టివిశ్రాంతినవసరమయ్యెనపుడు॥౧౧౮॥

XIV ౩౬౫—౩౯౨.

మ॥ నెలలోవర్షములోదినంబులొగనన్ నేనేమియున్లెక్కలన్।
దెలియన్వ్రాసి యెరుంగనిన్నియనుచుం దెల్పంగగుర్తేమియున్।
నిలుపన్లేదుమదియనేత్రయుగళిస్రో[illegible]దానిలో।
నలుసుంబాపెదనన్నయాసమదిలోనాకెన్నడున్లేమిచేన్॥౧౧౯॥

గీ॥ విధికివేసారివేసారివిసికివిసికిఁ।
గటకటంబడియుండంగఁగాలవశతఁ।
దుదకుఁగొందరుజనులునన్వదిలిపెట్ట।
వచ్చివిడుదలఁజేసిపోవచ్చుననిరి॥౧౨౦॥

గీ॥ ఏలవిడచితిరనినన్నునెవరినడుగ।
లేదుపోవంగనేదారిలేదునాకు।
బంధములనున్నలేకున్నభావమొకటి।
తుదకునిస్పృహనైకొనమదివరించె॥౧౨౧॥

గీ॥ కట్టకడకేగుదెంచినన్గరుణవారు।
విడచిపెట్టిరిబంధాలవిరగఁగొట్టి।
యరయనీమొద్దుకుడ్యమధ్యప్రదేశ।
మాశ్రమంబయ్యెస్వీయమైయమరెనాకు॥౧౨౨॥

గీ॥ వారువదిలింపనచటికివచ్చినపుడు।

నాద్వితీయాలయమునుండినన్నుదొలఁగఁ।
జేయవచ్చినవిధమునచిత్తమందుఁ।
దోఁచియొకకొంతసేపునేతొట్రుపడితి॥౧౩॥

సీ॥ సాలీళ్ళతోనేనుసఖ్యంబుసేసితి వానిచికుఁటలవృత్తివరుసఁగంటి।
వెన్నెలరాత్రులవేడ్కతోవిహరించు మూషకంబులఁగంటిమోద
మలర। వానికంటెనునాకున్యూనతయేటికి వసతివాడలుమాకువా
వియొకట। ప్రతిజాతికచ్చటఁబ్రభువునైయుండుటఁ జంపగవానిని
శక్తికలదు॥

గీ॥ వినుడుచెప్పెదనదియేమివిస్మయంబొ।
పోరుపాకెఁటమిలేకుండఁబ్రొద్దుప్రొద్దు।
మంచితనమునమిగులనెమ్మదినిఁబ్రతుక।
నేర్చుకొంటిమిపనిబడెనిక్కమరయ॥౧౪॥

గీ॥ కాళ్ళఁబిగఁగొట్టినట్టిశృంఖలమునేను।
సహచరత్వంబుఁగంటిమిసాహచర్య।
దైర్ఘ్యమునసుంటసిత్తితాత్పర్యమబ్బె।
విడుదలైనసునిట్టూర్పువిడచికొంటి॥౧౫॥

గీ॥ తొల్లిబైరనుకవివరుఁడెల్లకవులు।
ప్రస్తుతింపంగనాంగ్లేయభాషఁగూర్చె।
నిలఁ "జిలాన్ బంది" యనుకథనిప్పుడాంధ్రి।
శయ్యశ్రీష్టుజగన్నాథశాస్త్రిగూర్చె॥౧౬॥



సర్వంబు నేకాశ్వాసము

సంపూర్ణము.

